# పతాకము జాతీయ చిహ్నము

## జనసామాన్యము అభివృద్ధియే ప్రజానుకూల ప్రభుత్వ కర్తవ్యము

మదరాసు డిసెం ౨౦

మదరాసు నగరమునకు నేటిదివసము శుభోదయ దివసముగా గలదు. ఈనగరమునందు అఖిలభారత ఖాదీ స్వదేశ వస్తుప్రదర్శనము జరుపబడు సందర్భమున సర్ సి. వి. రామన్. సి. రాజగోపాలాచారి, మంత్రులు, పరిషు, శాసనసభల అధ్యక్షులు, మద్రాసు మేయరువంటి ప్రభృతులు పాల్గొనుట అపూర్వము.

ఈ ప్రదర్శనము తమిళనాడు వారి యాజమాన్యమున జరుపబడినది, సుమారు వేయిమంది ఆహ్వానింపబడిరి.

తమిళనాడు కాంగ్రెసు సంఘాధ్యక్షులగు సి. యన్. ముత్తురంగ మొదలియారు గారు సర్ రామన్, ప్రధానామాత్యుల, యితరులను స్వాగతపరచిరి.

త్రివర్ణ జాతీయ పతాకమును ప్రతిష్ఠించుచు ప్రధానామాత్యులగు శ్రీ సి. రాజగోపాలాచారిగారు "జాతీయపతాకము దేశమందలి వివిధ వర్గముల, మతములవారికి జాతీయ చిహ్నము. భారతదేశమందలి కోట్లకొలది ప్రజలవలన యిది పూజింపబడవలయును. జాతికియొకటే పతాకముండవలయును. వివిధ పతాకము లుండిన దేశీయులందు ఆసంఘీభావమున్నటుల విదితమై తీరును, త్రివర్ణము కాంగ్రెసుదిమాత్రమే గాక దేశమందలి ప్రతివారిది. కాంగ్రెసువారిని ప్రతిఘటించువారిది సహిత మనవచ్చును. మనపతాకమును పూజించువారిసంఖ్య హెచ్చినకొలది దాని గౌరవప్రతిష్ఠలు నలుగురి నలవల వ్యాపించుచుండును"ని ప్రజల హెచ్చరించిరి.

ప్రజలు జాతీయోత్సాహముతో నలువుచున్న కరతాళధ్వనుల మధ్య ప్రధానామాత్యులు పతాకమును ప్రతిష్ఠించిరి.

సర్ సి.వి. రామన్ గారు ప్రదర్శనమునకు ప్రారంభోత్సవము సలుపుటకు పూర్వము జాతీయపతాకము, దాని అవశ్యకతగూర్చి ప్రజల ప్రబోధించుచు "త్రివర్ణపతాకము సత్యచిహ్నము సత్యము, అహింసా మూర్తులగు గాంధీమహాత్ముని ప్రకాశము దానియందు పరిపూర్ణముగా గలదు"ని నుడివిరి.

సర్ చంద్రశేఖర్ వేంకటరామన్ గారు "దేశముయొక్క ఐశ్వర్యము ప్రజల—స్త్రీలు, పురుషులు, బాలుర, వృద్ధులు, యువకులు నేయేల దేశీయులందరు — మనోభావములందు గలదు. కోట్లకొలది మనప్రజలు శారీరికముగా, మానసికముగా, భౌతికముగా దరిద్రులు. ప్రజలు మానసికముగా, ఆర్థికముగా ఆధ్యాత్మికముగా, భౌతికముగా అభివృద్ధి పరచుటయే ప్రజానుకూల ప్రభుత్వ కర్తవ్యము. వర్తమానకాలమునకు మూలాధారమగు ప్రకృతిశాస్త్ర అనుపయోగకరమైనది యిది నెరవేరజాలదు; తిశాస్త్ర అనుపయోగకరమైనది యిది నెరవేర ఈ ప్రకృతి శాస్త్రముతో నే మనము మనదేశీయ ఐశ్వర్యమును వృద్ధిచేయ గలుగుదుము"ని పలికిరి.

"దేశముయొక్క ఐశ్వర్యమును హెచ్చించక వున్నదానిని వినియోగపరచుటకు, విభజించుటకు మొదలిడిన అగ్నితో ఆటలాడినటు లుండును"ని హితవొసగుచు ప్రదర్శనమును ప్రారంభించిరి.

వ్యవసాయము, పరిశ్రమలు, ఆరోగ్యము, మొదలగు వివిధశాఖలకు సర్ రామన్ మొదలగు ప్రభృతుల త్రిప్పిచూపిరి.

తిరువాన్కూరు, కొచ్చిన్, మైసూరుసంస్థానము లీప్రదర్శనములందు పాల్గొనిరి.

ఖాది, చిత్రలేఖనము, కళావిషయము అనేకములు ప్రదర్శింపబడినవి.

—

# ఇష్తెహారు

## దారుల్ఖజాబల్దా

తారీఖు ౨౫ దై ౧౩౪౭ఫ.

అబ్దుమ్ఖాతూన్ వనాం ఫైజల్ యూమిన్ఖాన్ వగైరాల మొకద్దమాలో ఈ అదాలతువారు కమీషనరుల ద్వారా పూర్వపు జిల్లాపోలీసు మొహతమీంలగు, కీ. శే. ఫైజల్ యామీన్ ఖాన్ యొక్క (గోషామహల్ కుంటారోడు మొజ్జంజాహి మార్కెటుముందు గల) ౪౧౬ నంబరు పెద్దయిల్లును, దాని నంటియున్న విస్తీర్ణమైన భూమిని వేరు వేరుగా ౧౩౪౭ ఫ. బహమన్ ౨౫వ తేది శనివారమునాడు ఉదయము ౯ గంటలకు హర్రాజు చేయబడును. ఈ యింటిలో నల్లా, లైటు మరియితర సౌకర్యములు విశేషముగాగలవు ఇవిగాక హనుమకొండ మంచెర్లయందు మధ్య బజారునందుగల ౧౬౮౦ నంబరు ౧౩ మడిగెలు, ఒకయిల్లు (మడిగెలన్నిటియందును కిరాయదారులున్నారు)ను వేరువేరుగా నీలాం చేయబడును. ఇంతియకాక ఒకయిల్లు, వరంగలుజిల్లా హనుమకొండ బాలసముద్రపు షికం తాలాబు ౨౫౯ ౬ నంబరుభూమిలో సహా ౧౩౪౭ఫ, ఇస్ఫందార్ ౧ ౨వ తేది శుక్రవారము ఉదయము ౯ గంటలకు కమీషనరులద్వారా హర్రాజుచేయబడును. అవసరముగలవారి కిదిమంచి సమయము. ఆప్రదేశమందే అపుడే సేబారాహర్రాజుకూడా చేయబడును.

దీవాని జాబితా అహకాములననుసరించి నీలాము చేయబడును. సేబారా ఎవరిపేర ముగియునో వారిక్కి హర్రాజు మొత్తమునందు నాల్గవభాగము అపుడే చెల్లించ వలసియుండును. మిగతనీలాం మొత్తము ౩౦ దినములలోగా చెల్లించుట విధియగును.

దస్తఖతు

అదాలతు శిరస్తేదారు



## రాణీ సోమ

(౫వ పేజీ తరువాయి)

...ఇతడు పొందిన వాత్సల్యాత్మృతం గ్రోదజానికి సంతృప్తుడౌతాడు. ఏవిధంగానైనా యీ కాదంబర్యని ఆశీష్టప్రాప్తి తప్పదు.

(రాణి శిరము వాల్చుకుంది. మాటలవల్లప్రయోజనంలేదని తెలుసుకొని కుడ్యాన్ని సమీపించి భావ భరంచేత దానిమీద వాలబోతూ.. )

రాణి: అమాత్యులవారికే ఆ నిర్ణయాన్ని వదిలింది మహారాణి.

కాం: మహారాజ్ఞీ !

రాణి: అమాత్యా. ! ఏది సర్వశ్రేయమో దాన్ని ఆచరించటానికి మీ అనుజ్ఞ ఐంది

కాం: మహారాజ్ఞీ ! (సంతోషంతో)ఐతే.. సెలవు

(ఇతడు కదురు తీసుకుంటూ నిష్క్రమిస్తాడు)

(కౌండిన్యుడు కనుచూపు మేరదాటే వరకూ రాణి చూస్తూనే ఉంది కదలివచ్చి. ఆమెలో అంతులేని విచారం గోచరించింది, అదంతా దిగమ్రింగుకొని శయ్యను సమీపిస్తుంది ఏదో ఆలోచిస్తూ మంచంమీద తలపెట్టి వాలుతుంది అంతలో భానూదయ వేళ కావచ్చిందని దివాణంలో నగారా మ్రోగింది.)

రాణి శ్లో॥ తవనజానే హృదయం మమపునః
కామోదివాపిరాత్రావపి
నిర్ఘృణ తపతి బలీయః
త్వయివృత్త మనోరథాన్యం గాని

భావము: నువ్వు నన్నే విధంగా తలుస్తున్నావో తెలియదు నాకుమాత్రం మన్మథతాపం బహు యెక్కువగా ఉంది

(శాకుంతలం)

(క్రిందికి వెళుతుంది)

* * *

## నాల్గవ రంగము

(యుద్ధభూమి. ఇసుక వేసినా రాలని జనం బారులు తీరి పోరాడుతున్నారు. మధ్యగా అమాత్యుడు కౌండిన్యుడు ఉన్నతాశ్వంమీదకూర్చుని సైనికులకు హుషారిస్తున్నాడు. పోరు బహు తీవ్రరూపందాల్చింది శరవర్షం కురుస్తాయి. దోవైపున. కత్తులపరుగులుకురుస్తున్నై మరోవైపున. ఇరువంకనుబడ్డవారు నిలఒడ్డలేక నేలకూలుతున్నారు. అమాత్యుడు స్వప్రాణ రక్షణార్థం డాలునుపయోగిస్తూ దొరికిన శత్రువునల్లా కత్తికి అందిస్తున్నాడు. ప్రతివీరునినోటా "అమాత్యునికి జే" అన్న పదమే లాశ్యం చేస్తోంది. లందరూ ప్రాణాలకి తెగించిన యోధులే కావటంచేత అమాత్యుని ప్రోత్సాహంవల్ల శత్రుసైన్యంలోకి చొచ్చుకుని పోతున్నారు జానాపీకులు. రణభూమి అంతా రక్తసిక్తమై ప్రతి వీరుని నెత్తికీ యెఱ్ఱటోపీ ఐంది.

అంతలో ఓశ్వేతాశ్వం వెనుకనుంచి రివ్వున వచ్చింది. దానిమీద ఒక నవయువక మూర్తి మిసమిసలాడే యౌవనంలో ఉన్నవాడు ఆసీనుడైనాడు. సరిగా ఆమూర్తి అమాత్యునికి ప్రక్కగా నిలఒడి అతి తీవ్రంగాశత్రుసంహారం చేస్తున్నాడు. కొలదిసే పలాపోరుసాగింది... అమాత్యుని దృష్టి అటుతిరిగింది రెండు మూ ళ్లగా దిగా చూశాడామాత్యుడు... నూతనవ్యక్తిని. తొలుత భయాన్ని ప్రకటించినా వెంటనే చిరునవ్వునూ... ఉత్సాహాన్నీ వెలుబరదినా అతని నయనాలు. ఆ నవయువకున్ని ముఖంలో లజ్జా సంతృప్తి చిందులేసినాయి.

అమాత్యుడు పరాకుగా ఉన్న సమయంలో ఒక శాత్రవఖడ్గం అమాత్యుని అశ్వాన్ని పడగొట్టింది. ఒరగబోతు నేడున్న అమాత్యుని శిరంమీద కత్తి వాలబోయింది, కాని ప్రక్కనేడున్న నవయువకమూర్తి అశ్వంమీదకు చేరబోతున్న సమయంలో ఆ శిరస్సున పడాల్సినఖడ్గం కుడి భుజంమీద గట్టిగా ముద్దుపెట్టుకొని కుడితొడమీదకు వెళ్ళి ఆగింది. అమాత్యునికి స్పృహ తప్పింది. ఆశాత్రవ ఖడ్గధారి నేలకూలాడు. అమాత్యుడూ నవయువకుడూ కూడా ఒకమరు పెల్లిగానూ మరొకర గంభీరంగానూ సైన్యానికి ఉత్సాహాన్ని పోశారు. నవయువకున్ని గొంతు సైన్యానికంతకీ గుర్తుకావటంచేత కాబోలు ఆకేకనే పదిమారులు అరచి గంతులు వేసింది ఆవేశంతో. మరుక్షణం రక్తఝురిలో మునిగినట్లున్న అమాత్యుని హృదయానికి దగ్గరగా హత్తుకొని ఆ నూతనపురుషుడు వెనుదిరిగి పరుగుతీశాడు. ఖల్లపోయే దూరపు గొంతులోంచి "కౌండిన్యామాత్యులకు జే!" అన్న పదాల స్పష్టంగా వినిపించినాయి:రణభూమిలో.ఆనవీన మూర్తి అశ్వం మహారాణివారి అంతఃపురంవేపు దాటితీసింది.)

సేన.—శ్రీ శ్రీ. అంధవీర కౌండిన్యామాత్యుల వారికీ . జే ! శ్రీ శ్రీ సోమ మహా మహారాణివారికి జే !

## ఐదవ రంగము

సాయంసమయము. అంతఃపురంలో ఒకగది. పసిడిమంచంమీద పట్టు పరుపుపైన అమాత్యశేఖరుడు కౌండిన్యుడు పడుకున్నాడు. చేతికీ కాలికీ కట్టుకట్టి నాయి. ఎదుటివాళ్ళనుచూస్తాడు కాని పల్కరించేశక్తి అంతగాలేదని దీనంగా ఆగ్ని నయనాలునువని చేసుకుంటున్నాయి ప్రక్కనే రాణికూర్చుని విసురుతోంది అప్పుడప్పు డతనిపాదాలు ఒత్తుతూ చేతినీ... నిమురుతూఉంది. కౌండిన్యుని కళ్లలో కృతజ్ఞతాభయమూ రెండూ ద్యోతమౌతున్నాయి రాణీనయనాల్లోదీనత్వం. అకృతాగోచరిస్తున్నై అప్పుడప్పుడు ఆమె నయనాలనుండి అశ్రువులురాలి కౌండిన్యుని తొడమీదుగా జారి పాదాలు కడగాలని ప్రయత్నిస్తున్నాయి ఇదంతా

(౯వ పేజీ చూడుడు)

